# వద్యాంగమూర్తి

ప్రొఫెసర్ ఎస్. సత్యనారాయణమూర్తి




తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

వేదకథాభారతి - 4

# దధ్యంగ మహర్షి

రచన

ప్రొఫెసర్ ఎస్. సత్యనారాయణ మూర్తి

ప్రధాన సంపాదకుడు

ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య




ప్రచురణ

డాక్టర్ ఐ. వి. సుబ్బారావు, ఐ.ఏ.ఎస్.,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

1999

VEDAKATHĀ BHĀRATI - 4

DADHYANGA MAHARSHI

by

***Professor S. Satyanarayana Murthy***

Chief Editor

***Professor S. B. Raghunathacharya***

First edition 1999

Copies : 10,000

Published by :

***Dr. I.V. Subba Rao, I.A.S.,***
Executive Officer
Tirumala Tirupati Devasthanams
Tirupati

Price :

Printed at
ANNAPURNA GRAPHICS
53, (Upstairs) R.S. Gardens
Tirupati ✆ : 30184

# మామాట

**డాక్టర్ ఐ.వి. సుబ్బారావు,** ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

నిత్య సత్యమైన ప్రమాణాలు వేదాలు. మానవజాతి మనుగడకు అడుగడుగునా మార్గదర్శనం చేస్తూ నిస్స్వార్థ బుద్ధితో, త్యాగమయమైన ప్రవృత్తితో తమ తమ జీవితాలను పండించుకున్న ఎందరో మహానుభావుల జీవన వైభవాలు మనకు వేద వాఙ్మయంలో దర్శనమిస్తున్నాయి.

''ఆహా! ఎటువంటి కర్తవ్యదీక్ష! ఎంత విశాలదృష్టి! ఎటువంటి విశ్వకల్యాణభావన! ఎంతటి ధార్మిక చేతన!'' అని మనల్ని ఆశ్చర్యపరిచే జీవనవేదం మనకీ వాఙ్మయంలో ప్రత్యక్షమౌతుంది. ఆ వేదనాదాన్ని ఇంటింటా వినిపించాలనే మా ఆకాంక్షకు ప్రతిరూపమే -

**ఈ వేద కథా భారతి.**

వేదకథాభారతిలోని ఎనలేని మానవత్వపు విలువలు ఈ తరాన్ని ప్రభావితం చేయగలిగితే అంతకంటే మాకు ఆనందమేముంటుంది ?

ఈ కథాపుష్పాలను సంపాదించి తీర్చి దిద్ది అందమైన మాలగా రూపొందించిన ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్య గారిని మనసార అభినందిస్తున్నాను.

ఇంత చక్కగా ముద్రించిన అన్నపూర్ణ గ్రాఫిక్స్ వారికి అభినందనలు.

జయతు జయతు భారతీ
వేద కథా భారతీ

# మనవి

వేద కథాభారతి.

అంతశ్శత్రువులను అణచివేసి కొన్ని ఆదర్శాలకు, విలువలకు పట్టంకట్టి, ధార్మిక జీవనానికి ప్రాణంపోస్తూ ఈ లోకంలోనే కాక ఇతరలోకాల వారికి కూడా నిండైన మానవత్వమంటే 'ఇది' అని ఆచరణ పూర్వకంగా నిరూపిస్తూ, అందులోని మధురిమలను చవిచూపిస్తూ వేదనాదవిభాసురమైన ఒక జీవన స్రవంతి ఈ గడ్డపై వెల్లివిరిసింది.

జలజలసాగే ఆ అమృత వాహిని వసుంధరను రసమయం చేసింది. సస్యశ్యామలం చేసింది. సుగంధపరిమళాలను వెదజల్లే నందనోద్యానాలను వెలయించింది. మానవ సృష్టిలో అరుదైన ప్రమాణాలను కొన్నింటిని నిలబెట్టింది. వాటికి కాలదోషం లేదు. ఆనాటికి, ఈ నాటికి, ఏనాటికైనా మానవతకు గమ్యాన్ని, జీవనానికి అర్థాన్ని పరమార్థాన్ని సాధించడంలో ఆ ప్రమాణాలు చరితార్థాలయినాయి. అలాంటి జీవన చిత్రాలకు పట్టిన అద్దమే ఈ వేదకథాభారతి.

ఒక్కసారి పరిశీలించండి ! ఆ చిత్రరామణీయకతను మంచిమనసుతో దర్శించండి ! వారి ఆత్మల ఔన్నత్యాన్ని వారి భావనల ఔచిత్యాన్ని మీరు తప్పక అభినందిస్తారు ! అవి మంచివని తోస్తే అనుసరించచడానికి ప్రయత్నించండి ! ఆనందించండి !

ప్రమాథి - నిజజ్యేష్ఠ

బహుళ - సప్తమి

5-7-1999

ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య

# దధ్యాంగ మహర్షి

ఆశ్రమవర్ణన :

అది దధ్యంగ మహర్షి ఆశ్రమము. ప్రాతఃకాలమున సూర్యుని ఎఱ్ఱని కాంతులతో ఆకాశము చూడ ముచ్చటగనుండెను. పిల్లవాయువుల మందగమనముచే వాతావరణము ఆహ్లాదమును కల్గించుచుండెను. పక్షుల కిలకిలధ్వనులు వీణానాదమును తలపించు చుండెను. నిరంతర హోమధూమములతో ఆశ్రమమంతయు సుగంధయుక్తముగ నుండెను. నానావిధ ఫలపుష్పములతో సమృద్ధిగ నుండు లతలు వృక్షములు వసంతఋతుశోభను తలపించుచు ఆశ్రమమునకు శోభను కలుగజేయు చుండెను. కోకిల గానములు అతిథులను ఆహ్వానించుచున్నట్లుండెను. లేళ్ళు నిర్భయముగ ఆశ్రమమున సంచరించుచుండెను. శాంత చిత్తులకు మహర్షుల తపః ప్రభావమేమో! శాశ్వతమగు విరోధము గల జంతువులు కూడ ఎంతో మైత్రితో అచ్చట మెలగుచున్నవి. లేళ్ళు పులులు, గుర్రములు ముంగీసలు మున్నగునవి జాతి విరోధమును మరచినవి. కామము, క్రోధము మున్నగు శత్రువులకు అచ్చట ప్రవేశము లేదు. హోమాగ్నులనుండి నింగికెగయు ధూమము స్వర్గమునకు నిచ్చెనలా? అన్నట్లుండెను. వృక్షములను ఆధారముగ చేసుకొని పైకెగబ్రాకులతలు మోక్షమునకు దారి చూపుచున్నట్లుండెను. వేదనాద ములలో సత్వగుణము మిగిలిన రెండిటిని జయించినది. ఎటుచూసిన మూర్తీభవించిన ధర్మమే విహరించుచున్నది. ఆశ్రమమంతట నిత్యకృత్యముల యందు సంలగ్నమైన ఋషికుమారుల సందడి.

వేదనాదామృతముతో ఆశ్రమమంతయు ప్రతిధ్వనించు చుండెను.

దధ్యంగ వర్ణన :

మూర్తీభవించిన ధర్మస్వరూపుడు దధ్యంగమహర్షి. అపకారియగు ఇంద్రునకు కూడ ఉపకారము చేసిన మహోన్నత వ్యక్తి. స్వార్థము వారి దరిచేరదు. వారి నిత్య కర్మలన్నియు. మానవకళ్యాణము కొఱకే. పాపపంకిలమగు జగత్తును ఉద్ధరించుటయే వారి లక్ష్యము. తాము మోక్షమార్గమును అన్వేషించుచు ఎందరికో బ్రహ్మమార్గమును ఉపదేశించుట వారి ఆశయము వేదమాతను ఆరాధించుచు, శిష్యులకెందరికో తమ విద్యను పంచిపెట్టుట వారి నిత్యకృత్యము. వినీలాకాశంలో ధృవతారలుగ వెలుగు అగ్రగణ్యులగు మహర్షులలో దధ్యంగమహర్షి ఒకడు. బ్రహ్మజ్ఞానియగు అతనికి లోకమంతయు ఎండమావి వంటిది. మనము ఏ సంసారమును నిత్యముగ తలచి భోగములననుభవించుచు తృప్తి చెందక ఇంకను ఏదో పొందవలెనని మథనపడు చున్నామో అది యంతయు వానికి తృణప్రాయమే. బ్రహ్మపదార్థమందే వారు రమించెదరు. బ్రహ్మానందము తప్ప మరియే ఆనందము వారికి గోచరించదు. అతని ఆశ్రమమున ఎందరో శిష్యులు కలరు. దధ్యంగుడు కులగురువు. ఉదారచరితులగు ఋషులకు తనవాడు, పరాయివాడను భావన ఉండదు. దధ్యంగమహర్షి కోమలస్వభావుడు, దయార్ద్రహృదయుడు, శిష్యవత్సలుడు. ఆధ్యాత్మికచింతనయే పరమలక్ష్యముగ భావించుచు శిష్యులకు విద్యనేర్పుటలో ప్రసిద్ధికెక్కినవారు.. వారి ఆశ్రమము ప్రకృతి ఒడిలో మనోహరముగ

నుండుటయేగాక, శిక్షణలో ప్రసిద్ధిపొందుటచే ఎందరికో ఆకర్షకముగనున్నది. నిత్యము నూతనముగ చేరు విద్యార్థులతో ఆశ్రమము కళకళలాడుచుండును. వేదశాస్త్రములకు పుట్టినిల్లై సంసారసాగరతరణమునకు సేతువై భాసిల్లుచున్నది. అందు సంసారసాగరమునుండి జనులను తరింపజేయువాడు దధ్యంగుడు. దధ్యంగ మహర్షి ప్రకృతి శోభను తిలకించసాగెను. ఏదో అసంతృప్తి అతని చూపులలో గోచరించుచున్నది. భవిష్యత్తులో జరుగబోవు సంఘటనకు సంబంధించిన ఛాయలు అతని ముఖముపై కనబడుచుండెను. ఋషులు ద్రష్టలు. భూతభవిష్యద్వర్తమానములు వారికి కరతలామలకములు. మనకు ప్రత్యక్షముగాని విషయములన్నియు వారికి గోచరించును. ఎట్టి విషయమునైనను బాగుగ మననము చేసి దాని యథార్థస్థితిని గ్రహించగలరు. కాని జరుగబోవు దానిని తప్పించుట ఎవరికి సాధ్యము? అతని ముఖకవళికలు ఏదో జరుగరానిది జరుగ బోవునట్లు సూచించుచున్నవి. మౌనముద్రను దాల్చి ధ్యానములో నిమగ్నమాయెను. శిష్యబృందము వారి వారిపనులలో నిమగ్నమాయెను. కొందరుపుష్పసమిధలను తెచ్చిరి. కొందరు వేదపాఠమును వల్లించుచుండిరి. మరి కొందరు ఋషీశ్వరుని నిత్యకర్మలకు ఏర్పాట్లుగావించుచుండిరి.

ఇంద్రునిరాక :

ఆశ్రమాధిపతియగు దధ్యంగ మహర్షి ఎందరో శిష్యులకు వేదవిద్యను నేర్పుచుండెను. నిరంతర వేదఘోషతో ఆశ్రమము మారుమ్రోగుచుండ ఇంతలో అచ్చటకు ఒక అపరిచిత వ్యక్తి వచ్చెను.

ప్రతిరోజు ఎందరికో ఆతిథ్య మిచ్చుమహర్షికి అందరు పరిచితులే. కాని అపరిచిత వ్యక్తిని చూడగనే అతనికి ఆశ్చర్యము కలిగెను. వచ్చిన మహాపురుషుడెవరో తెలియక దధ్యంగుడు మీరెవరు? తపోవనమునకు తమ రాకకు కారణమేమి? అని ప్రశ్నించెను. అప్పుడు అపరిచితవ్యక్తి 'నేను జ్ఞాన సముపార్జనకై వచ్చిన అతిథిని. మీ గొప్పతనమును వింటిని. మీ దర్శనము జన్మజన్మలకు మాకు పుణ్యము కలిగించును. ఎంతో మంది శిష్యులకు బ్రహ్మజ్ఞానము కలిగించు మీ రెంతో ధన్యులు. తమ కీర్తి ముల్లోకములలో వ్యాపించినది. జ్ఞానవృద్ధులగు మీరు అతిథియగు నా కోరిక తీర్చుటకు మాట ఇచ్చినయెడల నా రాకకు కారణము నివేదించగలనని చెప్పెను. కృపా వల్లభుడు, అతిథిసేవా తత్పరుడగు దధ్యంగుడు తన కర్తవ్యమును నిర్వహింపదలచి అట్లేయని మాట ఇచ్చెను. వైదికధర్మములలో తల్లి, తండ్రి, గురువులను పూజించుటతో బాటు, అతిథిపూజకుకూడ ప్రముఖస్థానముగలదు. అతిథికి ఆదిథ్యమిచ్చి అతనికోర్కెను తీర్చుట అందరికర్తవ్యము. అందున మహర్షి ఆశ్రమమునకు అతిథి రాక. అతిథివిషయమున లింగభేదము వయోభేదము లేదు. వచ్చినవారెవరైనను, అపరిచితులైనను, చివరకు తనను ద్వేషించువాడైనను గౌరవించుట భారతీయసంప్రదాయము. కనుకనే తగ ఆశ్రమమునకు వచ్చినవ్యక్తి ఎవరో తెలియకపోయినను ఆతిథ్యమిచ్చి కోర్కెను తీర్చుటకు దధ్యంగుడు సిద్ధపడెను.

### ఇంద్రుని కోరిక :

పిమ్మట ఆశ్రమమునకు వచ్చిన వ్యక్తి దధ్యంగునితో ' ఓమహర్షి!

తమరు నాకిచ్చిన మాటకు నేనెంతో కృతజ్ఞుడను. నారాకకు కారణము చెప్పెదను. నేను స్వర్గలోకాధిపతి యగు ఇంద్రుడను. పాండిత్యములో మీకు మీరే సాటి. బ్రహ్మజ్ఞానములో మీకు మించిన వారెవరు? మిమ్ములను ఆశ్రయించిన ఎందరో శిష్యులకు వెద శాస్త్రములను ఉపదేశము చేయుచు సంసారబంధములనుండి ముక్తిని కలుగజేయుచున్నారు. లోక కళ్యాణము కొఱకు చేయు మీ ప్రయత్నము ఎంతో ప్రశంసనీయము మానవులు మీ వలన బ్రహ్మజ్ఞానము నొంది దుఃఖభూయిష్టమగు ప్రపంచము నుండి మోక్షము నొందుటను చూచి బ్రహ్మతత్త్వమును తెలుసుకొనవలెనని నాకు కూడా కోరిక కల్గినది. దానివలన నేను స్వర్గలోకము నుండి ఇచ్చటకు వచ్చితిని. మానవులకు దుర్లభములగు స్వర్గసుఖములను నేను అనుభవించు చున్నాను. సకల దేవతలకు నేను అధిపతిని. అమృతపానము చేసిన మాకు మృత్యు వెక్కడ? ముసలితనము లేదు. సుఖసంపదలతో తులతూగు నాకు బ్రహ్మతత్త్వము తెలుసుకొనవలెనని ఇచ్ఛ కల్గినది. ఈ కారణముచే నిగూఢమగు రహస్యమును తెలుసుకొనుటకు మధువిద్యకై మీవద్దకు వచ్చితిని. నన్ను మీ శిష్యునిగ స్వీకరించి బ్రహ్మజ్ఞానమును ఉపదేశింపుడు. భూలోకమున ఇనుమడించిన మీ పేరు ప్రతిష్ఠలు స్వర్గలోకమునకు కూడ వ్యాపించును. మీ వద్ద శిష్యునిగ చేరుట నా అదృష్టముగ భావించెదను. శిష్యుడు సమర్థుడగు గురువును వెదకును. గురువుకూడ అర్హుడగు శిష్యుని కోరును. ముక్కోటి దేవతలకు అధిపతి యగు ఇంద్రుడు సవినయముగ మీ వద్దకు వచ్చినాడు. చీకుచింత లేని నాకు బ్రహ్మవిద్యను కూడ పొందవలెనని కోరికకల్గినది. నా కోరికను అంగీకరించవలసినదని ప్రార్థించెను.

## దధ్యంగుని ద్వైధీభావము :

అతిథిగ వచ్చిన వ్యక్తి ఇంద్రుడని తెలుసుకొని దధ్యంగ మహర్షి ఆశ్చర్యపడెను. అతని నోట మాట రాలేదు. ఇంద్రుని మాయాజాలము లోకములకు తెలియనిదికాదు. నిజముగ అతడు బ్రహ్మవిద్యను నేర్చుకొనుటకు వచ్చినాడా? అందులో కుతంత్రము ఏమైన ఉన్నది? తన ఆధిపత్యమును నిలబెట్టుకొనుటకు ఏదైనను చేయగలడు. యోగ్యుడా? అయోగ్యుడా? అని విచారము చేయక చేసిన విద్యాదానము సఫలము కాదు. అపాత్రునకు చేయుదానము నష్టలమే కదా. అందుకు కొంత విచారణ అవసరము. శిష్యునిగ స్వీకరించి బ్రహ్మజ్ఞానమును ఉపదేశించుటకు కొన్ని అర్హతలు అవసరము. మధువిద్యను పొందుటకు ఇంద్రుడు అర్హుడేనా? అని ప్రశ్న. కాని మహర్షి అతిథి కోరికను తీర్చుటకు ముందుగనే మాట ఇచ్చెను. ఇచ్చిన మాట నిలబెట్టుకొనవలెనా? లేక అనర్హునికి బ్రహ్మ విద్యను ఉపదేశించవలెనా? ముందు నుయ్యి వెనుక గొయ్యి. ఇచ్చిన మాట నిలబెట్టుకోలేక పోయినను, అర్హత లేనివానికి విద్య నేర్పినను దోషమే కదా మహర్షి సంకట స్థితిలో పడెను. ఇచ్చిన మాట నిలబెట్టుకొనుట భారతీయ సంప్రదాయము. ఆడిన మాట తప్పరాదు. హరిశ్చంద్రుడంతటి వాడు అసత్యదోషమును పరిహరించుకొనుటకు ఎన్నో కష్టముల ననుభవించెను కదా. ఒక్క అబద్ధమాడిన లేదా ఆడిన మాట తప్పిన అతని జీవితమంతయు సుఖమే. కాని మహాపురుషులు సాంసారిక సుఖములకు ప్రలోభపడి ధర్మమార్గమును విడువరు. కౌరవ పాండవ యుద్ధమున ధర్మమునకే కదా అంతిమ విజయము. మరి సమస్యను మహర్షి ఏవిధముగ పరిష్కరించెనో చూద్దాం.

**యుక్తాయుక్తవిచారము :**

అన్నము, విద్య, కన్య ఈ మూడిటిని అడగని వారికి ఈయకూడదు. అడిగినను పొందుటకు అతనికి అధికారమున్నదో లేదో పరిశీలించవలెను. అర్హత లేని వానికి విద్యనేర్పిన అది బూడిదలో పోసిన పన్నీరే. అయోగ్యునికి శాస్త్రములు నేర్పిన దానివలన నష్టమే గాని ప్రయోజనము లేదు. గురువు, శిష్యుడు తనకంటె గొప్పవాడు కావలెనని కోరుకొనును. కనుకనే ప్రతిగురువు తను నేర్పిన విద్య సఫలమగుటకు యోగ్యుడగు శిష్యుని ఎంచుకొనును. అందున బ్రహ్మ పదార్థమును ఉపదేశింపవలెనన్న అధికారమున్నదా? లేదా? యోగ్యుడగునా? కాదా? అని తప్పక పరిశీలించవలెను. బ్రహ్మోపదేశము పొందు వానికి ఇంద్రియ నిగ్రహము అవసరము. కామము, క్రోధము, లోభము, మదము, మాత్సర్యములను జయించవలెను. ప్రతివ్యక్తి సుఖమును కోరుకొనును. సుఖదుఃఖములు తను చేసిన కర్మల ననుసరించి లభించును. పుణ్యకర్మలవలన స్వర్గ సుఖములను పొందినను పుణ్యఫలము క్షీణించిన తిరిగి మర్త్యలోకమున ప్రవేశించును. పాపకర్మలవలన దుఃఖములననుభవించును. దీనిని తప్పించుకొనుట ఎవ్వరికి సాధ్యము కాదు. ఈ సృష్టి అంతయు ప్రళయ కాలమున నష్టమగును. పంచమహాభూతములతో ఏర్పడిన ఈ శరీరము ఏదో ఒక రోజు నశించవలసినదే. ఆత్మ నిత్యము. ఈ సత్యమును తెలుసుకొని భగవంతుని శరణు వేడుట ఉత్తమ మార్గము. మనస్సు చంచలమైనది. దీనిని అదుపులో పెట్టుట కష్టసాధ్యము. సమస్త పాపకర్మల నాచరించుటకు మనస్సు యొక్క చాంచల్యమే కారణము. దీనిని జయించుటకు ఎంతో సాధన చేయవలెను.

ధర్మము, అర్థము, కామము, మోక్షము పురుషార్థములలో మోక్షమును పొందుట దుర్లభము. బ్రహ్మజ్ఞానము వలన ఇది లభించును. దీనికి ఇంద్రియములను జయించుట మొదటి మెట్టు. బ్రహ్మజ్ఞానము పొందుటకు జితేంద్రియుడు అర్హుడు. ఇంద్రుడు బ్రహ్మ తత్త్వ ఉపదేశము పొందుటకు అర్హుడేనా? నిరంతరము స్వర్గసుఖముల ననుభవించు అతడు జితేంద్రియుడు ఎట్లగును? అహల్యావృత్తాంతము మనకు తెలియనిది కాదు. దేవేంద్రపదవిని నిలబెట్టుకొనుటకు ఎన్ని అకృత్యములు చేసెనో గదా. అప్సర స్త్రీలను పంపి ఎందరో మహర్షుల తపమును భంగపరచెను. కామభోగ లాలసుడు. నిరంతరము తన పదవిని కాపాడుకొనవలెనని ఆలోచన కల్గిన ఇంద్రునికి మనశ్శాంతి ఎక్కడ? అట్టి ఇంద్రుడు మధువిద్యకు అర్హుడేనా? మనుష్యులకొక నియమము, దేవతలకొక నియమము యుక్తము కాదు. కనుక బ్రహ్మోపదేశము చేయుటకు ఇంద్రుడు ఏ విధముగను తగినవాడు కాదు. ఈ విధముగ దధ్యంగ మహర్షి పలువిధములుగ ఆలోచించసాగెను.

**మహర్షి ఉపదేశము :**

ఇచ్చిన మాటను నిలబెట్టుకొనుట యుక్తముగ తలచి మహర్షి ఇంద్రునికి విద్యను ఉపదేశించుటకు నిశ్చయించెను. దధ్యంగుడు ఇంద్రునితో 'భోగలాలసుడగు పురుషుని మనస్సు ఎన్నోవ్యర్థ ఆలోచనలతో కలుషితమైయుండును, భోగము, మోక్షము పరస్పరము విరుద్ధములు. స్వర్గసుఖములు శాశ్వతము కావు. కల్ప వృక్షము, కామధేనువు, అప్సరసలు మున్నగు వాని వలన కలుగు సుఖము

తాత్కాలికమైనదే. అది నిత్యానందము కాదు. బ్రహ్మసాక్షాత్కారము వలన కలుగు ఆనందమే నిత్యము. అదియే మోక్షమార్గము. బ్రహ్మపదార్థమును తెలుసుకొనుటలో సామాన్యుడు దేవరాజు ఇద్దరు సమానమే. నిత్యము భోగముల కలవాటు పడిన ఇంద్రుడు ఎంతటివాడు. మనస్సును నిగ్రహించుకొనవలెను. ఓ ఇంద్ర! నీవు హృదయమందలి భోగబుద్ధినివిడిచి పెట్టుము. అప్పుడే బ్రహ్మతత్త్వమును బాగుగ తెలుసుకొనగలవు. అట్లు గాకున్న తుచ్ఛమగు శునకమునకు, ఇంద్రునకు తేడా ఏమి? కనుక అధికారదాహము విడిచి జితేంద్రియుడవు కమ్మని చెప్పుచు మధువిద్యను ఉపదేశించెను.

ఇంద్రుని ఆగ్రహము :

ఇంద్రుడు సామాన్యుడా? స్వర్గాధిపతి. ముక్కోటి దేవతలకు ప్రభువు. తన ఆజ్ఞలేనిదే అచ్చట చీమైనా కదలదు. కల్పవృక్షము, కామధేనువు మున్నగు నిరుపమానములగు వస్తువులు స్వర్గమునే ఉన్నవి. మహర్షుల తపమును సహితము తమ నృత్యక్రీడలతో భగ్నము చేయగల సమర్థులు రంభ, ఊర్వశి, తిలోత్తమ మున్నగు అప్సరసలు తన అధీనములో నున్నారు. అట్టి ఇంద్రునికి అహంకారము సహజమే కదా. దధ్యంగుని మాటలు వినిన ఇంద్రునికి చాలకోపము వచ్చెను. దేవరాజగు తను ఎక్కడ? అడవులలో తపమాచరించు సామాన్యుడెక్కడ? నికృష్టములగు వస్తువులతో తనను పోల్చుటను కలలో కూడ ఊహించలేదు. తనను ఈ విధముగ అవమానించునా? ప్రతీకారము చేయవలెనని అతనిలో అగ్నిజ్వాలలు చెలరేగెను. క్రోధాగ్నిని చల్లార్చుటకు

శతవిధముల ప్రయత్నము చేసెను. ఉన్మత్తులైన వారికి అది ఎంతమాత్రము సాధ్యము కాదు. తనను తాను నిగ్రహించుకొనలేక ఇంద్రుడు ' ఓ మహర్షి! నీవు ఈ విద్యను ఇతరులకెవరికైన ఉపదేశించిన నీ శిరస్సు తెగి నేలమీద పడునని హెచ్చరించెను. అధికారి కానివానికి విద్య నేర్పుటకు ఫలితమిదే.

**శాంతచిత్తులు మహర్షులు :**

మహాపురుషులు సుఖదుఃఖములలో సమానముగనే యుందురు. ఉపద్రవములకు భయపడరు. సంపదలకానందించరు. రాజ్యాభిషేకవార్త వినిన రాముడు ఉప్పొంగలేదు. వనవాసమునకు వెడలమనిన దుఃఖించనూ లేదు. ఇదియే మహాపురుషుల లక్షణము. ఇంద్రుని శాపము వినిన మహర్షి ఎంత మాత్రము చలించలేదు. అతని మాటలు తనపై ఎటువంటి ప్రభావము చూపలేదు. శాంతచిత్తుడై తన కర్తవ్యమును నిర్వర్తించ సాగెను. పెనుగాలులు మహావృక్షములను పెకలించివేసినను పర్వతములను ఏమియు చేయలేవుగదా. తన శాపమునకు మహర్షి ఎంతమాత్రము చలించక పోవుట చూచి ఇంద్రుడు ఆశ్చర్యపడెను. ఒకవైపు దురహంకారి, మరొకవైపు శాంతచిత్తుడైన మహర్షి. ఈ దృశ్యము లోకములనే ఆశ్చర్యపరచెను.

**అశ్వినీ దేవతలు మహర్షిని ప్రార్థించుట :**

కాలము గడిచెను. ఒకనాడు అశ్వినీ దేవతలు మహర్షిని సమీపించి వినయముతో ఓ మహర్షి! మాకు మధువిద్యను ఉపదేశింపుడు. ఎంతో ఆశతో మీ వద్దకు వచ్చితిమి. మా కోరికను మన్నింపుడని' వేడుకొనిరి.

అప్పుడు దధ్యంగమహర్షి 'బ్రహ్మవిద్యను పొందుటకు యమ, నియమాది గుణములు కలిగి అధికారమును సంపాదించితిరా? అని వారిని ప్రశ్నించెను. అశ్వినీ దేవతలు ' ఓ మహానుభావ! సత్యతపస్సంపన్నుడగు వ్యక్తి మాత్రమే ఇట్టి విద్యకు అధికారియని మాకు తెలుసు. మేము కఠిన తపమాచరించి కామవాసనలనుండి మా మనస్సును దూరము చేసితిమి. ఇప్పుడు మేము జితేంద్రియులము. లోక కళ్యాణ మాచరించుట మా జీవిత లక్ష్యము. దివ్యదృష్టి కల్గిన మీరు మాజీవన వృత్తమును తెలుసుకొని యుందురు. మేము ఏమిదాచినను మీ దగ్గర దాగదు. నిప్పును అరచేతిలో పెట్టుకొని ఎంతకాలము భరించగలము. ఇంద్రుడు సోమయాగమున సోమపానమునకు మమ్ములను అనర్హులుగ చేసినాడు. అప్పటినుండి ప్రతీకారజ్వాలలు మాలో రేగి ఇంద్రునిపై పగ తీర్చుకొన వలెనని తలచితిమి. కాని నికృష్ట కృత్యము చేయుటకు మనస్సు అంగీకరించలేదు. జనజీవనములో కలసి పరోపకారము చేయుటయే లక్ష్యముగ పెట్టుకొంటిమి. వైద్యము మా ప్రధానవృత్తి. మా వలన గ్రుడ్డివారు చూడగలిగిరి. కుంటివారు నడవగలిగిరి. ముసలితనముతో బాధపడు ఎంతోమందికి అది పోగొట్టి నూతన యౌవనమును ఇచ్చితిమి. చ్యవన మహర్షి వృత్తాంతము మీకు తెలియనిది కాదు. శర్యాతుని పుత్రికయగు సుకన్యతో అతనికి వివాహము జరిగెను. కాని వార్ధక్యము వలన అతని జీవితము దుర్భరమాయెను. అప్పుడు మేము అతనికి నూతన యౌవనము ప్రసాదించి అతని జీవితములో వసంతము చిగిర్చితిమి. దీనికి ప్రత్యుపకారముగ చ్యవనుడు సోమపానమునకు మాకు అవకాశము కల్పించినాడు. రాక్షసులు నూతిలో పడవేసిన రుభుడను ఋషిని, అట్లే

బందనుడను ఋషీశ్వరుని జలములనుండి రక్షించితిమి. అంధకారమున పడవేయబడిన కణ్వుడు మీచే రక్షింపబడినాడు. కూపమున పడవేయబడిన అంతకుడను రాజర్షిని, సముద్రమధ్యమున నిమగ్నమైన భుజ్యుని, రాక్షసులచే పీడింపబడు కర్కంధు వయ్యులను రక్షించితిమి, శుచంతుడుమున్నగువారికి ధనధాన్యములనిచ్చితిమి, అసురులచే అగ్నిచే బాధింపబడు అత్రిని మంటలబారినుండి రక్షించితిమి, పృశ్నిగు, పురుకుత్సమున్న గువారుకూడ మాచే రక్షింపబడినవారే. కుంటివాడగు పరావృజునికి నడకను, గ్రుడ్డివాడగు ఋజాశ్వునికి దృష్టిని, ప్రసాదించితిమి. ఇట్లే అనేకమంది ఋషులను, మానవులను రక్షించితిమి. బ్రహ్మవిద్యను పొందుటకు అవసరమగు గుణములన్నియు మా వద్ద కలవు. దానిని పొందుటకు మేము తగిన వారము. కావున బ్రహ్మతత్త్వమును ఉపదేశింపుడని ప్రార్థించిరి.

దధ్యంగుని మానసిక ప్రవృత్తి :

దధ్యంగ మహర్షికి విషమస్థితి కలిగినది. ఇంద్రుడంతటి వాడు పరమ తత్త్వమును తెలుసుకొనుటకు వచ్చిన, అర్హత కలవానికే విద్యోపదేశము తగునని సున్నితముగ మందలించెను. అధికారియగు వ్యక్తి వచ్చిన విద్యను తప్పక ఉపదేశింపవలెను. లేకున్న తన విద్యనిష్ఫలమగును. అశ్వినీ దేవతలు విద్యను పొందుటకు అర్హులే. వారికి ఉపదేశము చేయక పోయిన తను అపరాధియగును. కాని మరొకవైపు ఇంద్రుని శాపము గలదు. ఇతరులకు బ్రహ్మవిద్యనుపదేశించిన తన శిరస్సు ఖండితమగును. బ్రహ్మవిద్యను అర్హులకు ఉపదేశింపవలెనా? లేక స్వార్థబుద్ధితో తన

జీవితమును నిలబెట్టుకొనవలెనా? పరస్పర విరుద్ధ భావములు రెండు మహర్షిని వేధించసాగెను. కాని మహర్షులు ఎన్నటికీ స్వార్థమును గూర్చి ఆలోచించరు. ఒకవేళ స్వార్థభావము మనస్సులో పుట్టినను దానిని ఆదిలోనే త్రుంచివేయుచుందురు. ఐహిక సుఖములను విడిచి బ్రహ్మసాక్షాత్కారమే జీవితలక్ష్యముగ చేసుకొనినవారికి స్వార్థమెట్లుండును. జీవితము నీటి బుడగవలె అశాశ్వతము ఈ సత్యమును గ్రహించక మానవులు సంసారబంధమున కొట్టుమిట్టాడుచు, చేయగూడని పనులు చేయుచు పాపమును మూటగట్టు కొనుచున్నారు. కాలచక్రమున జననమరణములు సహజములు. అన్నిజన్మలలో మానవజన్మ శ్రేష్ఠమైనది. పశుపక్ష్యాదులకు లేని యుక్తాయుక్త విచారము జ్ఞానము మనుష్యులకు కలదు. జ్ఞానములేని మానవుడు పశువుతో సమానము. ఎంతో పుణ్యవిశేషముచే కల్గిన మానవజన్మను సఫలము చేసుకొనవలెను. మోక్షమార్గమునకు ప్రయత్నము చేయుటకు మానవ జన్మ తొలిమెట్టు. అనిత్యములగు సంసారసుఖములవైపు దృష్టి మళ్ళించక భగవద్దర్శనము వలన కలుగు నిత్యసుఖమును పొందుటకు కొందరు ప్రయత్నించెదరు. శారీరికసుఖములను విడిచి అడవులకు వెడలి తపము నాచరించెదరు. ఎంత మాత్రము స్వార్థము వారి దరిచేరదు.

**ఇంద్రునిశాపము : అశ్వినీ దేవతల పరిష్కారము :**

దధ్యంగ మహర్షి అశ్వినీకుమారులకు విద్యను ఉపదేశించుటకు నిశ్చయించుకొనెను. ఈ వార్త వినిన వారి ఆనందమునకు అవధులు లేవు. తమ జన్మ సఫలమైనట్లు తృప్తి పడిరి. కాని మహర్షి వలన ఇంద్రుని శాప

వృత్తాంతమువిని నిర్ఘాంతపోయిరి. వారి ముఖముపై ఒకవైపు ఉత్సాహము, మరియొకవైపు విషాదము. ఇంద్రుడంతటివాడు అకారణముగ మహర్షిని శపించుట యుక్తమేనా? యుక్తాయుక్త వివేకశూన్యుడై, మదాంధుడై ఇంద్రుడు ప్రవర్తించిన తీరు అశ్వినీ దేవతలకు ఆశ్చర్యము గొలిపినది. కాని దీనికి తగిన పరిష్కారము కూడ వారి వద్ద కలదు. సంజీవనీ విద్యయందు సిద్ధహస్తులు వారు. తమవిద్యచే అచేతనులను చేతనులుగ చేయగలరు. తమ విద్య ప్రయోగించు అవసరము లభించినందున వారు ఎంతో సంతోషించిరి. అశ్విని దేవతలు తమవిద్యయొక్క ప్రభావమును మహర్షికి వివరించుచు ఓ మహర్షి! మేము తాత్కాలికముగ తమ శిరస్సును వేరు చేసి దానిస్థానములో గుఱ్ఱము శిరస్సును మీకు అతికించెదము. అశ్వము యొక్క శిరస్సు కలవారై మీరు మాకు మధువిద్యను ఉపదేశింపుడు. ఇంద్రుని క్రోధమునకు పాత్రులై గుఱ్ఱము శిరస్సును పోగొట్టుకొనిన పిమ్మట మీ శిరస్సును తిరిగి మీకు అతికించెదము. ఈ విధముగ ఇంద్రుని క్రోధాగ్ని నుండి దూరము కాగలరు. మీకు ఎటువంటి ప్రాణహాని కలుగదు. మా కోరిక కూడ నెరవేరునని' చెప్పిరి. మహర్షి అంగీకరించెను. అశ్వినీ దేవతలు మహర్షి శిరస్సును భద్రపరచి దాని స్థానములో గుఱ్ఱము తలను అతికించిరి. ఇదొక విచిత్రసంఘటన లోకములన్నియు విచిత్రముగ తిలకించుచున్నవి. అశ్వముఖుడగు మహర్షి అశ్వినీకుమారులకు మధువిద్యను ఉపదేశించెను. వారు బ్రహ్మవిద్యకు సంబంధించిన రహస్యములన్నియు బాగుగ తెలుసుకొనిరి.

**మహర్షి ఉపదేశము :**

ఈ లోకమున సమస్త పదార్థములు ఒకదానికొకటి ఉపకరించుకొనును. పంచమహాభూతములు సమస్త ప్రాణులకు

మధువుకాగా, సమస్తప్రాణులకు భూతములు మధురూపములే. విశ్వమునకు ఆధారము ధర్మము సత్యము, ధర్మము మున్నగునవి మధురూపములు. ప్రళయ కాలమున సృష్టియంతయు పరమాత్మ యందు లీనమై యుండును. పరమాత్మకు సృజించవలెనని కోరిక కల్గినపుడు అవిద్య లేక మాయ సహాయముచే సృష్టి జరుగుచున్నది. జననమరణములు స్వాభావికములు. ఎంతో పుణ్యము చేసినగాని మానవ జన్మ లభించదు. దీనిని సుఖభోగములకు నిలయముగ చేసుకొనిన కాలప్రవాహమున కొట్టుమిట్టాడుట తప్పదు. అట్లుగాక జ్ఞానసముపార్జనకు సాదనముగ చేసుకొనిన మానవ జన్మ సఫలమగును. ఆత్మ సాక్షాత్కారము పొందినవాడు పరమాత్మలో లీనమగును. అతనికి మరి జన్మ లేధు. జన్మ లేకున్న దుఃఖమెక్కడిది. చీకటిలో త్రాడును చూసి సర్పమని భ్రాంతి పడి ఎంతో భయపడెదము. భయపడి తిమిగాని హాని జరుగలేదు కదా. ఇదియంతయు భ్రమవలన కల్గినది. మెరిసే వస్తువులను చూసి బంగారమని గ్రహించిన తాత్కాలిక ఆనందము కల్గినను నిజము తెలిసిన తరువాత దుఃఖమే కదా. సృష్టి అంతయు మిథ్య. లేనిది ఉన్నట్లు అగుపించును. మహాప్రళయమున ఏమియు మిగులదు. సూక్ష్మరూపమున అంతయు భగవంతుని యందు లీనమగును. మానవుడు పరమార్థమును తెలుసు కొని పరతత్త్వమును తెలుసుకొనుటకు ప్రయత్నించవలెను. అధికారభేదముచే ఇది పొందుటకు జ్ఞానమార్గము, కర్మమార్గము, భక్తిమార్గము మున్నగు సాధనములు గలవు. ఎవరు ఏ మార్గమనుసరించినను పరమాత్మను చేరుట అను లక్ష్యమొక్కటే. కనుక ఓ అశ్వినీ దేవతలార! ఈ రహస్యమును తెలుసుకొని జీవితమును ధన్యము చేసుకొనుడని మహర్షి ఉపదేశించెను.

బ్రహ్మవిద్యను పొందిన అశ్వినీ దేవతలు ఎంతో ఆనందించి మహర్షికి తమ కృతజ్ఞతా భావమును ప్రకటించిరి.

**ఇంద్రుని ఆగ్రహము :**

తనను కాదని మధు విద్యను మరొకరికి ఉపదేశించుటను ఇంద్రుడు సహింపకుండెను. మధువిద్యను పొందుటవలన అశ్వినీకుమారులకు ఆనందము. కాని అదియే ఇంద్రుని క్రోధమునకు కారణమాయెను. తన మాట చెల్లుబడి కాకపోవుటను కొందరు సహించరు. అందున ఇంద్రుడు ముందుగనే హెచ్చరించెను. మహర్షి తన హెచ్చరికను లెక్క చేయక తన ఆదేశమును ధిక్కరించుటను, ఇంద్రుడు చేయరాని నేరముగ భావించెను. ఈ దేహముపై మమకారము లేని మహర్షులు దేనికిని భయపడరు. కాని ఇంద్రుడు అహంకారి. ఒక సామాన్యమానవుడు దేవాధిపతియగు ఇంద్రుని ఆజ్ఞను ధిక్కరించుటయా? తనకు తప్ప ఇతరులకు మధువిద్యనుపదేశించిన శిరస్సు ఖండితమగునని హెచ్చరించినను మహర్షి లెక్కచేయలేదు కదా. తనకెంత అవమానము. ఈ విధముగ గర్వాంధుడయిన ఇంద్రుడు తన ఆయుధముతో దధ్యంగుని శిరస్సును ఖండించెను. అవినీతులగు శిష్యులు ఎంతటి అకృత్యము చేయుటకైనను వెనుకాడరు.

**అశ్వినీదేవతలు గురువును రక్షించుట :**

ఇంద్రుడు దధ్యంగుని శిరస్సును ఖండించుటను తెలుసుకొనిన అశ్వినీ దేవతలు గురువునకు ఇచ్చిన మాట నిలబెట్టుకొనుటకు ఆలస్యము చేయక అచ్చటకు వచ్చిరి. తమకు బ్రహ్మవిద్యను ఉపదేశించుట వలన కదా గురువులకు ఇట్టి దురవస్థకల్గినది. ఇంద్రునిపై వారికి అసహ్యాభావన

ఏర్పడినది. మహర్షి యొక్క శిష్యవాత్సల్యమునకు ఆశ్చర్యపడిరి. ఎంతటి సహనము అతనికి. తను తలచిన ఇంద్రుని ఏదైనను చేయగల సమర్థుడు మహర్షి. శిష్యుడు అపరాధము చేసినను గురువు క్షమించి అతనిని మంచి మార్గమున ప్రవర్తింపజేయును. అదియే గురువు గొప్పదనము. అట్టి గురువు ఎడల ఇంద్రుడు ప్రవర్తించిన తీరువారికి ఎంతో ఖేదము కల్గించినది. గురువునకు వారిచ్చిన మాట నిలబెట్టుకోవలసిన సమయము ఆసన్నమైనది. వారు ముందుగనే భద్రపరచిన శిరస్సును తిరిగి మహర్షికి అతికించిరి. మహర్షి బ్రతికెను. అశ్వినీ దేవతలపనికి అందరు సంతోషించిరి. గురువు ఎడల ఇంద్రుని కృతఘ్నత, అశ్వినీ దేవతల కృతజ్ఞత లోకములను ఆశ్చర్యపరచినవి.

ఇంద్రుని పశ్చాత్తాపము :

ఇంద్రుడు దధ్యంగుని సమీపించి ఓ మహర్షి! నేను చేసిన అపరాధమునకు సిగ్గుపడుచున్నాను. విద్యను ఉపదేశించిన గురువుల శిరస్సును ఖండించి నేను ఎంతో పాపము ఆచరించితిని. నన్ను క్షమింపుడని వేడు కొనెను. మహర్షి ఇంద్రునితో ' నీ యెడట నాకు ఎటువంటికోపము లేదు. బ్రహ్మవిద్యను పొందుటకు అర్హతలు కూడ నీకు తెలిపితిని' అని చెప్పెను. మునివచనములు వినిన ఇంద్రుడు ఆనందముతో ' ఓ మహర్షి! అశ్వినీ కుమారులు మీయెడల చూపిన కృతజ్ఞతకు నా అహంకారము తొలగినది. వారి గురుభక్తి నా కెంతో ఆదర్శము' అని చెప్పెను.

దధ్యంగుని పరోపకారము :

ఇంద్రుడు నిర్మల హృదయుడాయెను. వృత్రుడు, శంబరుడు మున్నగు రాక్షసులదాడి నుండి తప్పించుకొనుటకు సహాయమునకై

దధ్యంగని ఆశ్రయించెను, అతని ఉపదేశమునమసరించి ఇంద్రుడు కురుక్షేత్రము దగ్గర 'శర్యణ' అమజలాశయమునుండి దధ్యంగ మహర్షి యొక్క ఖండింపబడిన ఆశ్వశిరస్సును వెదకి పట్టుకొని దాని వలన అనేక ఆయుధములను మరియు దాని ఎముకనుండి వజ్రాయుధమును తయారుచేసి వానివలన శత్రువులను ఓడించెను. అశ్వినీ దేవతలకు బ్రహ్మోపదేశము గావించిన మహర్షియొక్క అశ్వముఖము ఇంద్రునికి ఎంతగానో ఉపకరించెను.

ఆదర్శము :

వైదిక కథాస్రవంతిలో దధ్యంగుని పాత్రలోకములకెంతో ఆదర్శప్రాయము. అపాత్రునికి విద్యాదానముచేయుట ఎంతమాత్రము తగదు. లోకకళ్యాణము లేదు సరికదా అపకారము కూడ జరుగును సమర్తుడగు శిష్యుడు ఆచార్యుని ప్రతిష్ఠను ఇనుమడింపజేయును అశ్వినీకుమారులు యోగ్యులగు శిష్యులగుటచే ఇంద్రునిశాపమునుండి గురువును రక్షించిరి. పశ్చాత్తాపమును మించిన ప్రాయశ్చిత్తములేదు. చేసిన తప్పు తెలుసుకొని సరిదిద్దుకొనుట మానవధర్మము. మహాత్ములు అపకారము చేసినవారికి అపకారము తలచక ఉపకారమే చేయుదురు. ఇట్టి మహోన్నత ఆశయములు మనకు దధ్యంగుని చరితమువలన లభించుచున్నవి.

*ఓం శాంతిః శాంతిః శాంతిః*

